# పీ ఠి క

ఇంగ్లీషు నేర్పు పాఠశాలలలో 1, 2, 3 ఫారములలోఁ జదువు విద్యార్థులకు నుపయోగపడు సులభపద్యవాచకములు లేమి, నేదైన నట్టి చిన్న గ్రంథము రచియింపు మని నా మిత్రులు కొందఱు నన్నుఁ గోరినందున నే నీగ్రంథము వ్రాయ వలసివచ్చెను. ఇందలి ప్రతిపద్యమున నేదో యొక దృష్టాంతము జూపఁబడినది. అన్నియు గీతపద్యములగుటచే దీనికి "గీతమంజరి" యని పేరు పెట్టితిని. ఇందలిపద్యములు బాలురు సులభముగాఁ జదువుటకు, వల్లెవేయుటకు, జ్ఞాపక ముంచుకొనుటకు ననుకూలముగా నుండునట్లు సులభశైలిని వ్రాయఁబడినవి.

నాయుద్యమమున నేనెంతవఱకుఁ గృతకృత్యుఁడనైతినో యీగ్రంథము బాలురకు బోధించునట్టి పండితమహాశయులే నిర్ణయింపవలయును.

20-6-1931
రాజమహేంద్రవరము.

ఇట్లు,
చిలకమర్తి లక్ష్మీనరసింహము.

శ్రీ ర స్తు.

# గీతమంజరి

---

## ప్రథమ భాగము.

తే. సచ్చిదానందరూపాయ శాశ్వతాయ
మౌనిమానసనిలయాయ మంగళాయ
నిర్వికల్పాయ నిత్యాయ నిర్మలాయ
జ్ఞానవారిధయే నమస్తే నమోస్తు. 1

తేటగీతములను గొన్ని తేటతెలుఁగు
నందు రచియించి సులభమౌనట్టిశైలి
గీతమంజరి యనుచిన్నికృతి నొనర్తు
బాలకుల కెల్ల నుపయోగపడెడునట్లు. 2

శ్రీకరునకుఁ గారుణ్యరత్నాకరునకు
నఖిలవేదాంతవేద్యున కవ్యయునకు
నాదిమధ్యాంతరహితున కచ్యుతునకు
సచ్చిదానందమయున కంజలి యొనర్తు. 3

తే. వేకువను లేచి పరమేశు వేఁడుకొనుఁడు
అతఁడె కల్యాణముల కెల్ల నాకరంబు
జ్ఞానమయమూర్తి బ్రహ్మాండచక్రవర్తి
భక్తి సేవింపుఁ డాతని బాలురార. 4

ఈశ్వరప్రార్థనంబు మీ రెల్లయపుడు
చేయుచుండినఁ గలుగదు చిత్తశుద్ధి
పానభోజనపాత్రముల్ ప్రతిదినంబుఁ
తోమకున్న మాలిన్యంబు తొలఁగు నొకొ. 5

హృదయఫలకంబునందు సర్వేశ్వరుండు
నిలిచియున్నఁ బాపపుఁజింత నిలువ దచట
పొడుపుకొండమీఁదను ప్రొద్దు పొడిచెనేని
నిముసమైనను జీఁకటి నిలువఁ గలదె. 6

ఈశ్వరుఁడు సృష్టిచేసినయినుఁడు లేని
యాదినం బొకదుర్దిన మయ్యెనేని
అతనియారాధనము లేని యాదినంబు
దుర్దినము గాక యుండునే దోషకలన. 7

పరమపావనుఁ డైన యాపరమపురుషు
సన్నిధిని క్రోధలోభముల్ క్షయము నొందు
మత్సరంబును మోహంబు మాయమగును
ఉష్ణదీధితియొద్ద మంచుండఁ గలదె. 8

తే. అన్ని వేళలయందును నరసిచూడ
నుదయకాలంబె ప్రార్థన కుత్తమంబు
కలఁతఁ జెందక స్వచ్ఛమౌ కొలనువోలె
నిర్మలం బయి యప్పు డుండు నెమ్మనంబు. 9

అరసిచూడ ప్రాతఃకాలమట్టిసమయ
మెందుఁ గలుగ దీశ్వరు స్మరియించుకొఱకు
నంధకారమ ట్లజ్ఞాన మణఁగిపోయి
వెలుఁగువోలె జ్ఞానము మది వెలయుఁ గాన. 10

కావు కా వంచు మనుజుండు దేవదేవు
వేకువను వేఁడుకొనకుంట విస్మయంబు
క్షుద్ర జంతువు కాకియు నిద్ర లేచి
కావు కా వంచు నఱచును గాదె మొదట. 11

పరమకారుణ్యు సర్వేశుఁ బాపకారి
క్రూరుఁ డని యెంచి దగ్గఱఁ జేరవెఱచు
పాఠము ల్చదువక తప్పుపనులఁ జేయు
బాలుఁ డొజ్జను గని దవ్వు పాఱినట్లు. 12

తప్పుపని పొరబాటున నెప్పుడైనఁ
జేయునతఁ డది క్రమ్మఱఁ జేయ ననుచు
మదిని సంతాప మొందుచో నొదవు శుద్ధి
అగ్నివోలెఁ బశ్చాత్తాప మఘముఁ గాల్చు. 13

తే. వేకువను లేచి ముందుగా విమలమూర్తి
నిత్యుఁ బరమేశు మదిలోన నిలుపు దేని
దుష్టచింతలు దానిలో దూర లేవు
లోన నవకాశ మేమియు లేనికతన. 14

పగలు నినుఁ గాచినందునఁ బడక వేళ
మాపు గాపాడినందునఁ రేపకడను
దేవదేవుని మదినిఁ బ్రార్థింప వలయు
మొదటికర్తవ్య మందఱ కదియ గాన. 15

ప్రార్థనము లేకయే మబ్బు వాన గురియు
నడుగకయె వీచు గాలి యహర్నిశంబు
వేఁడకయె చంద్రసూర్యులు వెలుఁగుచుందు
రార్యు లొనరింత్రు ధర్మ మయాచితముగ. 16

వీచుచున్నది వాయువు విసువు లేక
వెలయుచున్నాఁడు సూర్యుఁడు విరతి లేక
తిరుగుచున్నది ధారుణి తెంపు లేక
విశ్వహితకారి కెన్నఁడు విసుగు లేదు. 17

అస్వతంత్రజీవనుఁ డైన యట్టిమనుజుఁ
డెవ్వ రేమన్న నదె పల్కు నెదను మెచ్చి
పంజరంబున బంధింపఁబడిన చిలుక
కూయుమన్న కూఁతల నెల్లఁ గూయుఁ గాదె. 18

తే. ఒక్కచోఁ బుట్టి పెరుఁగుచు నున్న నేమి
యెవరిగుణములు వారివె యెంచి చూడ
ముత్యములు పుట్టునట్టిసముద్రమందె
నత్తగుల్లలుఁ గూడ జన్మమును గనవె. 19

దుర్జనుఁడుఁగూడ నైజమౌ ద్రోహ మెడలి
యాపదలు గల్గువేళ సాయంబు సేయు
ఘాతుకములైన రసవిషగంధకములు
ప్రాణములు గాచుఁ గాదె యాపదలయందు. 20

లోభి యొల్లెడఁ జరియించి లోకమందు
ధనముఁ గూర్చి యన్యుల కిచ్చి తనువు విడుచు
తేనెటీఁగ పువ్వుల వ్రాలి తేనెఁ గూర్చు
నాఫలం బెల్ల మానవుం డనుభవించు. 21

ఉన్నతస్థానమున నిల్వ నుత్తముఁ డగు
నధమపదవి నిల్పిన నరుం డధముఁ డగును
బట్ట లుదికినశిల చాకిబండ యగును
దేవళంబున నిడి కొల్వ దేవుఁ డగును. 22

మంచినీతుల నెన్నిటి వించునున్న
దుర్జనుఁడు సాధుజనుఁ డౌట దుర్లభంబు
మంచినీటినదులు ప్రవహించుచున్న
సాగరజలంబు లవమైన స్వాదువగునె. 23

తే. దుష్టసహవాసమునఁ జేసి దుష్టుఁ డగును
పరమ సాధువైనను గుణభ్రష్టుఁ డగును
కడలిలోపల వాహినుల్ గలియుచోట
మంచినీ రుప్పునీరుగ మారుఁ గాదె. 24

పండితులగోష్ఠిఁ దగిలిన బండయైన
జ్ఞానగంధ లేశము గల్గి గ్రాలుచుండు
విరులఁ గూడిన యా తలవెండ్రుకలును
కమ్మతావులు వెదజల్లఁ గలుగుఁగాదె. 25

ఆలిమగలమా టలొక్కటై యమరునపుడె
జరుగుచుండును జక్కఁగా సంసరణము
చక్రములు రెండు సమముగా సాఁగకున్నఁ
దిరుగనేర్చునె శకటంబు తిన్నగాను. 26

ఒక్కచో నున్నగుణము లింకొకట నుండ
వన్నిగుణములు నొకచోట నమరు టరిది
పండ్లు లేవు మల్లియకుఁ బుష్పములె గాని
పనసకును బుష్పములు లేవు పండ్లెగాని. 27

దేని కెయ్యది యర్హమో దానికి నది
ప్రాజ్ఞుఁ డగువాఁడు విని యోగపఱుపఁదగును
పసిఁడితో గడ్డపాఱలు పనికిరావు
ఇనుముతో నగల్ నాణెము లింపుగావు. 28

తే. అల్పదుష్టుల హతమార్చు నట్టివారె
యుగ్రదుష్టులఁ జేరి చేయుదురు చెలుపు
చిన్నదీపంబు లార్పెడు సన్నగాలి
కారుచిచ్చుకుఁ దోడయి కాల్చు నడవి. 29

పరమ విజ్ఞానవంతులపట్ల నైన
నధమగుణము లుండకమాన వరసిచూడ
నంధకారంబు నంతయు నడఁచునట్టి
దివ్వెతోడనె క్రీనీడ దిరుగుఁగాదె. 30

మంచిపండితుఁ డైనంతమాత్రమునను
నరుఁడు గుణవంతుఁ డంచును నమ్మరాదు
కమ్మతావులు వెదజల్లఁ గలిగినట్టి
యల గులాబిపువ్వునకు ముండ్లులమలేదె. 31

ఎంత యోగ్యత గలవానికేని జగతిఁ
గారణము లేనివైరులు గలుగుచుంద్రు
పుష్పరాజమౌ సంపంగి పూవుతావి
యొంతమందికో తలనొప్పి నెత్తఁజేయు. 32

చదువు లేనంతమాత్ర దుర్జనుఁడుగాఁడు
సుగుణముండిన నరుఁడు పూజ్యుండె యగును
మంచివాసన లేకున్న మంకెనపువు
అర్హమై యుండుగద దేవతార్చనలకు. 33

తే. సుద్దు లెన్నింటిఁ జెప్పిన బుద్ధి గుదిరి
వక్రచిత్తముల్ సరళభావంబుఁ గనవు
ఎన్నిసారులు సరిదీసి తన్ను కొన్నఁ
గుక్కతోఁక వంకరదీరి చక్కఁబడునె. 34

గొప్పవారియండను జేరి కొలఁదివారు
ప్రకృతిచే మందులయ్యును వన్నెగాంత్రు
అంబరంబున గ్రహరాజు నండఁజేరి
చల్లనివెలుంగు బడయఁడే చందమామ. 35

సత్పథంబున విహరించుజనము లెపుడు
మిగుల నల్పులయ్యును గడు మెఱయుచుంద్రు
సత్పథంబుననుండు నక్షత్రము లతి
సూక్ష్మతరము లయ్యును గడుశోభ గనవె. 36

ధనము తనయొద్ద లేకున్న దానశీలుఁ
డప్పుఁ దెచ్చియునైనఁ దా నర్థికిచ్చు
జలము తనయొద్ద లేకున్న జలధరుండు
కడలినీ రాని వర్షించుఁగాదె యవని. 37

నీటిచుక్కలు నాలుగు నిలిచియున్న
నార్తులకు జీవనమిడు జలాశయంబు
మేన నాల్గు నెత్తురుబొట్టులైన నున్న
నవని కుపకృతిసేయు మహాశయుండు. 38

తే. బ్రదికియుండి నీడలనిచ్చి పండ్లనిచ్చి
పూవు లిచ్చి యాకుల నిచ్చి ప్రోచు జనులఁ
జచ్చి యింధనమై మేలు చాలఁ జేయుఁ
జెప్పఁ దరమౌనె వృక్షంబు చేయుహితము. 39

సహజముగ నుండవలెఁ గాని జన్మముననె
మధ్యకాలంబునను రాదు మంచిగుణము
మల్లియకు జన్మమునతోనె మంచితావి
పొడమెనేగాని నడుమను బుట్టెనో కో. 40

కఠినచిత్తుఁ గృపావంతుఁ గా నొనర్పఁ
జాలి గలవాని నిర్దయు సలుపఁ దరమె;
తీపియగునె యెన్నఁటికైన వేఁపకాయ
చేఁదుగాఁజేయ శక్యంబె చెఱకుకఱ్ఱ. 41

దుష్టసహవాసమునఁ జేసి శిష్టుఁ డైన
నామ రూపముల్ లేక వినాశమొందు
మంచినీ రిచ్చి మనుజుల మనుచునదులు
అబ్ధిఁ జేరి యనామధేయములు గావె. 42

చారు రూపరేఖావిలాసములవలన
నరుఁడు పూజ్యుండుగాఁడు గుణంబులేక
దర్శనీయమై యున్నను డ్రాఁచుపాము
నెవ్వఁ డేనియుఁ దరిఁజేర్ప నెంచునో కో. 43

తే. మిరెపకాయలు కడుపార మెక్కి మెక్కి
కూయుచుండును హాయిగా గోరువంక
వెన్న మీగడల్ దిని పాలు పెరుగుఁ ద్రావి
కర్ణకటువుగా నఱచును గండుపిల్లి. 44

ఎంత తేజోధనుండైన నించుకంత
పరసహాయంబుఁ బడయక ప్రబల లేఁడు;
అగ్నిహోత్రుఁడు తేజస్వి యగును గాక
యొండు పుల్లలఁ గలియక మండునొక్కొ. 45

ఎంత మేధావి యైనను నించుకంత
గురునిశిక్షను బడయక కుదురుపడఁడు
వజ్ర మెంతటి వెలలేని వస్తువైన
సానఁబెట్టక మెఱయునే స్వయముగాను. 46

కోటిధనముగల్గు పిసినిగొట్టుకంటె
సరసుఁడైన సామాన్యసంసారి మేలు
అంచు దరియును లేని మహాబ్ధికంటె
మంచినీరున్న కడు చిన్న మడుఁగు మేలు. 47

ఆకుకూరలుఁ గాయలు నారగించి
సాధువులు హితం బొనరింత్రు జనుల కెప్డు
గడ్డి దిని తియ్యపాలిచ్చు గంగిగోవు
పాలు ద్రావి విసముఁ గ్రక్కు పాము లకట. 48

తే. సజ్జనుఁడు కృతజ్ఞుఁ డగును స్వల్పమునకు
నెంత జేసిన మెచ్చుఁ డొక్కెంత నీచుఁ
డెంగిలాకులు దిని కుక్క యిల్లుగాచు
నింటఁ జెడఁదిని బాంధవుం డెంచుఁ దప్పు. 49

కుమతి దనవాఁడు పగవారిఁ గూడినపుడె
గుట్టు బయలయి తనకొంప కూలిపోవు;
కట్టె కామయై గొడ్డలిఁ గలియకున్న
వట్టి గొడ్డలి మ్రానుఁ గూల్పంగఁ గలదె 50

ప్రాణికోటు లన్నమునీరుఁ బడయకున్న
విగతజీవంబు లగుటలో వింతయేమి
ప్రాణములు లేని యావిరియంత్ర మైన
నీరు లేకుండ నడువదు నిముసమేని. 51

పుట్టి పెరిగినచోటను బూరుషునకు
నధికగౌరవ ముండుట యరిది సుమ్ము
జన్మమొందిన యాప్రదేశంబులందు
వేళ్లు సన్నమైయుండుట యెఱుఁగమొక్కొ. 52

మింటఁ జుక్కలు లెక్కకు మించియున్న
నందులోఁ జంద్రుఁ డొక్కఁడే యలరుచుండు
క్ష్మాతలంబున నెందఱో మనుజులుండు
రందులో నుండునట్టి మహాత్ముఁ డొకఁడె. 53

తే. కఠినశీలు రయ్యును దగుకాలమందు
యోగ్యులగువారు నమ్రులై యుపచరింత్రు
ఇతరకాలంబులందుఁ దా నెట్టులున్నఁ
గనము వంగి కార్యముసేయుఁ గార్ముకంబు. 54

పొట్టు తిని చిట్టు తిని గడ్డిపోచలు తిని
బ్రతికి యున్నంత కాలంబుఁ బాలనిచ్చుఁ
జచ్చి నరునకుఁ బాదరక్షల నొసంగు
నెంత ధన్యమా జంతువో యెంచఁ బశువు. 55

నిడుదమీసాలు గడ్డాలు జడలు బెంచి
యడవి తిరిగినంతనె ముని యౌనె నరుఁడు
దట్టముగ వెండ్రుకలు గల్గి తనువునిండఁ
గానఁ దిరుగు భల్లూకంబు మౌని యగునె. 56

తల్లి దండ్రులకునుఁ దమతనయులందుఁ
బ్రేమ హెచ్చు కల్గదు ప్రీతి బిడ్డకట్లు
వచ్చుఁ బైనుండి క్రింది కేవస్తువైనఁ
గ్రిందినుండి పయికిఁ బోవు టెందుఁగలదె. 57

సారహీన మైనట్టి సంసారమందుఁ
గష్టములు పరంపరలుగాఁ గలుగుచుండు
నంచు దరిలేనియట్టి మహాబ్ధియందు
అంతు లేకుండఁ బొడమెడు నలలువోలె. 58

తే. కోమలాకృతి గలదని గుణవిహీను
నెంత బాలిశుఁడును జేరనిచ్చు నొక్కొ
చక్కఁగా నున్నదని క్రూరసర్పముఁ గని
ప్రక్క నిడుకొని యెవఁడైనఁ బండుకొనునె. 59

తనకుఁ గలదాని భుజియించి తనివిసనక
యాశలకుఁ బోయి మనుజుండు నాశ మొందు
మడుగులోపల స్వేచ్ఛగా మసలలేక
చేఁప యెఱకాశపడి తుదిఁ జెడునుగాదె 60

సాటిలేనికీర్తిని గన్న మేటి యైన
నల్పమైన దుష్కీర్తిచే హసితుఁ డగును
జగ మశేషంబు వెలిఁగింపఁజాలు నినుఁడు
చిన్నమబ్బులచేత సంఛన్నుఁ డగును. 61

తనకు నపకార మెన్నఁడుఁ దలపనట్టి
యనఘు హింసించు దుష్టుఁడు స్వార్థమునకు
దారిఁ బోయెడు పాంథుని దవ్వునఁ గని
మీఁదఁ బడి పెద్దపులి చంపి మ్రింగుఁ గాదె. 62

సద్గురూపదేశము కడుస్వల్పమయ్యుఁ
దోలు నజ్ఞానపుంజంబు దూరమునకు
చిరతరంబుగ నుండిన చీఁకటులను
ఛేద మొనరింపకుండునె చిన్నదివ్వె. 63

తే. విమలవిజ్ఞాని యొక్కఁడు వేలకొలఁది
యజ్ఞులను సద్గతుల కిట్టి యంపఁ గలఁడు
అతి సమర్థమౌ యావిరియంత్ర మొకటి
యెన్ని యోబండ్ల నవలీల నీడ్చునట్లు. 64

సద్గురులు చేయునుపదేశసారములను
నెంత యజ్ఞానమైనను నిట్టి పోవు
మంచి వైద్యుఁ డిచ్చెడు చిన్నిమాత్ర చేత
దారుణంబగు రోగంబు తలఁగునట్లు. 65

సుగుణశాలి నీచులచేతఁ జుట్టఁబడియు
సహజగుణమును విడువక సంచరించు
నాచు బెనఁగొనియున్నట్టి నళినమెప్పుడు
సహజసౌందర్య సౌభాగ్యసరణి విడునె. 66

అధమకులమునఁ బుట్టుక నందియున్న
గుణగరిష్ఠుఁడు పూజ్యుఁడై కొమరుమిగులు
పట్టిబురదలోఁ బుట్టియు వారిజంబు
వరగుణంబులచేతను వాసిగనదె. 67

ధనము లేనప్డు చుట్టాలు తఱుచు రారు
సిరులు గల్గిన బంధువుల్ చేరుచుంద్రు
ఆకు రాలినపుడు లేని యాపులుఁగులు
వానకారునఁ జెట్లపైఁ గానఁబడవె. 68

తే. మందుఁ డగునేని నెంతటిమనుజుఁ డైనఁ
జేవ గలపిన్నవానిచేఁ జేటుపడును
కడవయంతటి గుమ్మడికాయ యైనఁ
జిన్న కత్తిపీటకు లోఁగి చీల్పఁబడదె. 69

విశ్వమెల్ల నిండియును సర్వేశ్వరుండు
జ్ఞానవంతునకే గాని కానఁబడఁడు
గగనమం దెప్పుడుండు నక్షత్రసమితి
పట్టి కంటికిఁ గానంగఁబడునె పగలు. 70

అధికకోపసంతప్తుఁ డైనట్టినరుఁడు
శాంతి గనకున్నఁ ద్వరితంబు క్షయమునొందు
క్రాగుపాలను జన్నీళ్లు గలయకున్నఁ
బొంగి నిప్పులలోఁ బడి పోవకున్నె. 71

తగని సంతతి గలిగిన తల్లి కకట
నందనుని కారణంబున నాశమగును
చెనఁటి గెలయొండు పుట్టిన ననఁటిచెట్టు
క్షయము నొందక మానునే సత్వరంబ. 72

అతిరహస్యంబుగాఁ బాప మాచరింప
బయలుపడక మాన దదియెప్పటికి నైనఁ
తూములోపల నేదైన దూరి చచ్చి
కానఁ బడకున్న నిల్లెల్లఁ గంపుగాదె. 73

తే. గొప్పవారలు కడతేరఁ గొలఁదివారు
పెత్తనంబులు జేతురు పెద్దలమని
నధిక తేజస్వి యగుభానుఁ డస్తమింప
నాకసమున నక్షత్రము లాక్రమించు. 74

మాననీయుఁడు గృహయజమానుఁ డేగ
నాగృహంబు కళాకాంతు లణఁగిపోవు
గగనమాణిక్యమగు దివాకరుఁడు గ్రుంగఁ
గారుచీఁకటి నలుదెస గ్రమ్ముకొనదె. 75

బుద్ధిశాలి కళలునేర్చి వృద్ధిపొందు
శుక్లపక్షచంద్రుఁడువోలె శోభగాంచి
మందమతి క్షీణమొందుఁ గ్రమక్రమముగ
కృష్ణపక్షమందలి చంద్రరేఖవోలె. 76

పక్షపాతంబు లేనట్టి ప్రభువరుండు
నెల్లవారల సమముగా నెంచుచుండు
రత్నగర్భలమీఁదను రాతినేల
సమముగా వాన గురియఁడే జలధరుండు. 77

అవనిలోఁ గలసకలవస్తువులయందు
మంచిచెడ్డలు రెండు గన్పించుచుండు
అఖిలసౌఖ్యంబు లొడఁగూర్చునట్టినిప్పు
జాగరూకత లేకున్నఁ జంపుఁ గాల్చి. 78

తే. జాతిభేదంబు లేక విజ్ఞాన మలరు
నెల్లవారిచిత్తములందు నేకరీతి
కువలయేశుసౌధములోన గుడిసెలోన
వెలుఁగుచుండదె దీపంబు వేరులేక. 79

అన్నియెడలను సంతుష్టి యవసరంబె
దానిఁ బూర్తిగ గ్రహియింపఁ దరముగాదు
ఉప్పు రుచులలో ముఖ్యమై యొప్పుచున్న
నదియె ప్రత్యేకముగఁ దిన నలవిగాదు. 80

వరగుణంబుల వృద్ధులై వరలువార
లీడునకుఁ జిన్నలయ్యును గోడుగాండ్రు
పసిఁడికాసులు వెండిరూపాయి కన్న
చిన్నవయ్యును వెలచేత మిన్నగాదె. 81

పురుషకారంబు తగినంత ముందుజేసి
పిదప నీశ్వరు నమ్మిన నొదవు ఫలము
సాగుసేయక విత్తులు జల్లకుండ
పండునే నేల యీశ్వరప్రార్థనముల. 82

మానవుఁడు ప్రపంచమునందు మనఁగవచ్చు
చెనఁటిగొడవలు తనలోనఁ జేర్పరాదు
పడవ నీటిలోనుండఁగ వచ్చుఁగాని
నీరు పడవలో నెన్నఁడు నిలువఁ దగదు. 83

తే. భాగధేయంబు చక్కనై పరఁగునేని
గలుగు సిరులు వెలగకాయలో జలములట్లు
ఆయదృష్టంబు చెడ భాగ్య మంతరించు
నెండు కొబ్బరికాయనీ రిగురునట్లు. 84

ఒకనికి రుచించునది హేయ మొకనికగును
భిన్న పూరుషులకుఁ గల్గు భిన్నరుచులు
సర్వజన మాననీయమై సరసమైన
కమ్మ సంపంగి యిమ్మలి కసహ్యమ్ము గావె. 85

ఒక్కచోఁ బుట్టి పెరుఁగుచునున్న వారు
గుణగణమ్మున భేదంబు కొంత గాంత్రు
వజ్రమును బొగ్గు నొక్కటే వస్తువైన
విలువచే హెచ్చుతగ్గులు వింత గావె. 86

జనుల సుగుణదుర్గుణములు స్పష్టముగను
తెలియుచుండు దూరముననే తేటపడుచు
మల్లెపూవులతావియు నుల్లికంపు
దవ్వుదవ్వులయందె వ్యక్తములు గావె. 87

వేత్తలకడ విశేషంబు వినుచునుండి
స్వల్పమే మాటలాడంగ నగు నరుండు
రెండు చెవు లిచ్చి పరమేశ్వరుండు మనకు
నొక్క నాలుక మాత్రమే యొసఁగెఁ గాన. 88

తే. మంచి వారిని బట్టి పీడించుకొలఁది
వారి సద్గుణసారంబు వచ్చుఁ బైకి
చెఱకుఁగట్టుఁ గానుగలోనఁ జేర్చి నొక్క
స్వాదురస మెంతయును బయల్పడును గాదె. 89

ఎవ్వనియదృష్టవైభవం బెంత గలదొ
అంతియే దక్కుఁ గాని రా దధికధనము
పుడిసెడు జలంబుఁ ద్రావఁగఁ బోలుఁ గాని
యేటినీ రెల్లఁ గ్రోలంగ నెవనితరము. 90

ప్రజలు తను జూచి గడగడ వడఁకుచుండు
రనుచు నధికారి గర్వింపఁ జనదు మదిని
పలుతెఱంగుల పీడలపాలు జేసి
జనుల వడఁకింపదే చలిజ్వరముకూడ. 91

విగతకరుణుఁడై తనలోన విషముబూని
నిరశనవ్రత మూనుట నిష్ఫలంబు
ఎవరితోడ మాటాడ కెవరిఁ గనక
గాలిఁ దినుపాము పడయునే గౌరవంబు. 92

పేదపడినప్డు మనుజుండు పిఱికిపడక
బ్రతికియున్న వెండియు సిరుల్ బడయవచ్చు
ఆకు రాలువేళల వట్టివైన చెట్లు
క్రమ్మఱఁ జెలంగవే ననకారునందు. 93

తే. కాలవశమున హైన్యంబు గలుగుఁ గాక
ఓపికగలాఁడు వెండియు నొందు వృద్ధి
మండు వేసవి నింకినమడుగు లెల్ల
వారిపూరితంబులు గావె వానవావి. 94

క్రోధ మెన్నఁడు మది నెలకొల్పరాదు
అది మనస్సును దహియించు నంతులేక
అగ్ని నెటులైనఁ జన్నీళ్ల నార్పవచ్చు
క్రోధవహ్ని నెత్తుటఁ గాని గ్రుంగిపోదు. 95

శాకములు నారగించిన శక్తి పోదు
మాంస మాహరించిన మేటిమగఁడు గాఁడు
పిశితమును దినియెడుపిల్లి పెద్దయగునె
ఆకులను బియ్యమును మేయుహస్తికన్న. 96

ఎట్టివారల కవనిలో నట్టివారె
మనసు గలిసిన మిత్రులై మసలుచుంద్రు
మణికి బంగారమునకును మైత్రి గలియు
గాడిదకును బూడిదమీఁదఁ గరముప్రీతి. 97

చెఱుపు జేయఁగోరినవాఁడు చిఱుతయైన
నధిక నష్టంబుచేయ సమర్థుఁ డగును
గొప్ప గడ్డిమేటిని చిన్న నిప్పునెరసు
క్షణములోపలఁ గాల్చి భస్మంబుసేయు. 98

తే. స్వచ్ఛచరితంబు గలుగుసజ్జనులయందు
నల్పదోషంబు కనఁబడు నధికమగుచు
వెల్ల వైచినగోడపై నల్లమచ్చ
స్పష్టముగఁ గానఁబడినట్లు చందమునను. 99

కలహశీలురౌ పురుషులు గలిసికొన్న
పోరు వారికిఁ దప్పక పుట్టుచుండు
చెకుముకియు నుక్కుకణికయుఁ జేరనేని
మంట వెంటనే కలుగక మానునొక్కొ. 100

క్రూరులౌవారు పోరాడుకొనెడువేళ
నడుమ మెత్తనివాఁ డున్న నలిగి చెడును
ఇనుము చెకుముకియును గొట్టుకొనెడువేళ
మధ్యనున్న మెత్తనిదూది మండిపోదె. 101

మహితవిజ్ఞాననిలయులౌ మౌనివరుల
హృదయములయందు వసియించు నీశ్వరుండు
చంద్రసూర్యులు స్వచ్ఛమౌ జలమునందుఁ
బ్రతిఫలింతురు గాదె సౌభాగ్యమడర. 102

మాయచేత వంచించెడు మానవులను
మాయచేతనే గెల్చుట న్యాయమగును
చాకి మాసినబట్టలు చవుటిచేత
శుద్ధిచేయుచు నుండుటఁ జూడమొక్కొ. 103

తే. ప్రల్లదన మెట్టివారికిఁ బనికిరాదు
అది యనర్థంబులకునెల్ల నాకరంబు
గొడ్డటందెగుచెట్టు జిగుర్పవచ్చుఁ
బలుకులందెగుమది చక్కఁబడదు మరల 104

చండశాసనుఁడైన తేజస్వి రాక
వినియె పలుగాకిమూఁకలు ప్రీలిపోవు
సూర్యుఁ డంబరమందుఁ దోఁచుటకు ముందె
చీఁకటులు పటాపంచలై చెదరిపోవె. 105

దేహబల మెంతయున్నను ధీబలంబు
చాలనినరుండు పరులవశంబుఁ జెందు
మేటి విగ్రహపుష్టి యమేయబలముఁ
గలుగు నేనుఁగు నరుచేత గాసిపడదె. 106

తనకు లాభంబు లేకపోయినను ఖలుఁడు
జనులకును హానిచేయు నిష్కారణంబ
పెట్టెలోనున్న చీరెలు గొట్టివేయు
చిమ్మటకు నేమిలాభంబు చేకురెడును. 107

చెడ్డపని యలవడ నదే చేయబుద్ధి
చేసినకొలంది దానిపై స్నేహమెచ్చుఁ
బిడుము చేతను మేనెల్ల జిల జనింప
గోక బుద్ధి. గోకిన జిలపోక హెచ్చు. 108

తే. మాణవకుఁ డెంత సద్బుద్ధిమంతుఁ డైనఁ
జెడును క్రమశిక్ష లేకున్నఁ జిన్ననాఁట
వారువం బెంతలక్షణవంత మైన
కదను నేర్పింపకున్న నక్కఱకు రాదు. 109

అమలవిజ్ఞాన ముదయించు నంతవఱకు
గురునిశుశ్రూష గావించి కొలువవలయు
ఎడతెగని ధారగలజల పడినదాఁక
త్రవ్వవలయును గూపంబు తరుగు లేక. 110

చెనఁటి ప్రత్యుపకారంబు చేత నణఁగు
నుపకృతులచేత శాంతంబు నొందఁ డెపుడు
మెడకు గుదికట్టఁ గట్ట లోఁబడునుగాని
పున్నెమున కయి లొంగునే పోట్లగొడ్డు. 111

ఎవరిధర్మంబు వా రాచరింపవలయు
జంతువులు సైత మారీతి సలుపుకతన
కోడి జాముజామునకును గూయుచుండు
వేకువను కావు కావని కాకు లఱచు. 112

ఎవ్వ రెపు డెందునుండుట కేర్పడియెనొ
వార లట్టిచోట నుండంగవలయు విధిగఁ
దూర్పు దెసయందె నిచ్చలుఁ దోఁచు సూర్యుఁ
డపరవారిధిఁ దప్పక నస్తమించు. 113

తే. ఎంతటి కుశాగ్రబుద్ధి యై యొసఁగుచున్నఁ
దగినశిక్ష లేక నరుండు దనరలేఁడు
పసిఁడి తానెంత వెలగలవస్తు వైన
సుత్తిదెబ్బలు తినకుండ మెత్తఁబడునె. 114

ఇడుమ గలయప్పు డుపయోగపడునటంచు
ధనము నార్జించుకొనియుండఁ దగు వివేకి
సన్ననూకలు బియ్యము సంగ్రహించి
కన్నమున దాఁచుకొనుఁగదా సన్నచీమ. 115

చెడ్డపని సేయుమని తండ్రి చెప్పుచున్నఁ
గొడుకు దుష్కార్యమును జేయఁగూడ దెపుడు
తండ్రి హరిభక్తి వలదని తగనిబాధఁ
బెట్టఁ బ్రహ్లాదుఁ డవి చెవిఁబెట్టనొక్కొ. 116

పౌరుషముచేత మనుజుండు గౌరవంబుఁ
దెచ్చుకొనుఁగాని యది యెవ్వఁడిచ్చు మనకు
నెవఁ డొసఁగె సింహమునకు మృగేంద్రపదవి
మేఁకపోతున కది యెవ్వఁ డీకపోయె. 117

సాధుసంగంబు నెన్నాళ్లు సలిపి యున్న
నైజగుణము దుష్టుఁడు విడనాడలేఁడు
వేమునకుఁ బానకము బోసి పెంచిన నది
చేఁదుగొనమును విడనాడి స్వాదువగునె. 118

చెనఁటి కుపకార మెంతగాఁ జేసిన నది
తే. ప్రబలవైరకారణముగాఁ బరిణమించు
పంచదారను జిక్కనిపాలఁ గలిపి
పామునకుఁ బోయ నదిగాదె ప్రబలవిషము. 119

ప్రథమభాగము సమాప్తము.



శ్రీ ర స్తు.

# గీతమంజరి

## ద్వితీయ భాగము.

తే. శ్రీనిధికి సర్వలోకైకసేవితునకు
నాదిమధ్యాంతరహితున కచ్యుతునకు
నఖిలవేదాంతవేద్యున కచ్యుతునకు
నాదిదేవున కొనరింతు నంజలులను. 1

మంచివారిదాపున నున్న మంచి యబ్బు
చెడ్డవారిదగ్గఱ నున్నఁ జెట్ట గలుఁగు;
నదులదఱిఁ ద్రవ్వ మంచినీ రుదయమందు
ఉదధికడఁ ద్రవ్వ జనియించు నుప్పునీరు. 2

సాధువునకు జంతువులైన సాయపడును
కోఁతిమూఁక శ్రీరాముని గూడినట్లు
దుర్జనుని తమ్ముఁడైనను దొలఁగి విడుచుఁ
జండకోపు రావణు విభీషణుఁడువోలె. 3

తే. సజ్జనునితోడ సాధువు సంగతిఁ గన
గందమందుఁ గర్పూరంబు గలసినట్లు;
కుమతితోడుత దుష్టుండు గూడెనేని
భంగులోపల గంజాయి పడినయట్లు. 4

అల్పులగువారు సైత మత్యంతమైన
హాని సేయంగఁ జాలుదు రదను వెదకి;
వ్రాలి మలినవస్తువులపై మైల దెచ్చి
యన్నిటను జేర్చి సలుపదే హాని యీఁగ. 5

ఎవ్వరికి నక్కఱకు రాని హీనుఁ డైన
నుపకరింపంగవచ్చు నొక్కొక్కపనికి;
మూతిఁ జేర్పంగరానట్టి ముషిణికాయ
యౌషధంబుల కుపయోగ మగును గాదె. 6

అపకృతిని జేయువాతని నల్పుఁ డంచుఁ
దగ దుపేక్షింప నెటువంటిధార్మికునకుఁ
జిన్న దంచు దోమను నుపేక్షింతుమేని
సేయదే యొగ్గు నిద్దురఁ జెఱిచి వైచి. 7

ఎవరివంతు వచ్చిన వార లీల్గవలయుఁ
గాలనియతి నెంతటివాఁడు గడువ లేఁడు;
విశ్వమంతయు దిన మెల్ల వెలుఁగఁజేయు
నహిమభానుండు విలయంబు నందుఁ గాదె? 8

తే. జగతికిని మేలు చేసెడుసత్పురుషులు
ఎట్టిపనులఁ జేయుట కైన నిచ్చగింత్రు;
తనకరంబున మాలిన్యతతి హరించి
జగతి కారోగ్యదశఁ గూర్చుఁ జండకరుఁడు. 9

పాపమును జాటుగాఁ జేయు బాలిశుండు
తన్నొరులు గానరని మదిఁ దలఁచి చేయుఁ;
దల యిసుకలోన దూరిచి తన్నెవరును
జూడరని తలంచెడు నిప్పుకోడిలాగు. 10

అవసరంబులఁ బట్టి నెయ్యము లు సేయు
నరులమైత్రి యస్థిర మయి నాశమొందు;
నొక నదీప్రవాహమునఁ గొట్టుకొని పోవు
కట్టెలు కలసి విడిపోవుకరణి గాఁగ. 11

చిన్నవాండ్రయాలోచన స్థిరము గాదు
అనుభవజ్ఞునిమాట శిలాంకురంబు;
పచ్చియిట్టిక వేగంబ పగిలి పోవుఁ
గాలినది గట్టి యై చిరకాలముండు. 12

గాటమైనట్టిపూనిక గలుగునరుఁడు
సాధ్యములు చేయఁ జాలు నసాధ్యములను;
ద్రవపదార్థ మౌజలము తీవ్రముగఁ బాఱి
గట్టికొండల భేదింపఁ గలుగునట్లు. 13

తే. నిర్దయాత్మకడుపున జన్మించి యున్న
మానవుఁడు దయాళుండయి మనఁగవచ్చుఁ;
బర్వతంబులలోపలఁ బ్రభవ మొందు
వాహినులు జనంబులకు జీవనము లిడవె. 14

వెలుపలను లోపలను భేదములు గలిగిన
జనవరేణ్యుని రాజ్యంబు క్షయము నొందు;
నడుగునం బందికొక్కు లెప్పుడును ద్రవ్వఁ
బైన వానఁ దడియునిల్లు వడి నశించు. 15

అధముఁ డత్యున్నతస్థానమందు నున్నఁ
గక్కురితి నల్పవస్తువుల్ కాంక్ష సేయు;
గగనమునఁ గడు నెత్తుగా నెగురు గ్రద్ద
చేఁపలకు జల్లలకు నాశ జేయుఁ గాదె. 16

అవ్యవస్థితమానసు లైనవారి
యతిశయప్రసాదము నసహ్యమ్మె యగును;
కుక్కకు ననుగ్రహము చాల గుదురునేని
ఎగిరి యజమానుని శరీరమెల్ల నాకు. 17

పిన్నవాండ్రకు బుద్ధియు విద్య నేర్ప
నదను బాల్యంబె, యది దాఁటఁ జదువురాదు;
జతనముల నెన్నియో కాపు సలుపుఁ గాక
అదను దప్పిన విత్తనం బంటునొక్కొ? 18

తే. కరుణ నైనను లేక యాగ్రహము నైన
నతిశయంబుగఁ జూపు టనర్థ మగును;
అవని సస్యంబులకు నెల్ల నగును గాదె
నష్ట మతివృష్టిచే ననావృష్టిచేత. 19

ప్రాజ్ఞుఁ డగువాఁడు బుద్ధిసంపదనుబట్టి
మన్ను బంగారమును జేసి వన్నెకెక్కు;
విరివిగాఁ గుండలను జేసి విక్రయించి
భాగ్యవంతుఁ డై కుమ్మరి బాగుపడఁడె ? 20

నిగ్రహానుగ్రహములందు నేర్పుగలుగు
మేటిప్రభువు సేయఁ గలండు మేలుఁ గీళ్లు;
కిరణములచేత జలము నింకింపఁ గలఁడు
వెండియును నింపఁగలఁ డేళ్లు వృష్టి నినుఁడు. 21

తెలివి గలబాలుఁడును శిక్షఁ దేలకున్నఁ
గ్రమముగా మొద్దుబాఱి యక్కఱకు రాఁడు;
తొలుతఁ గాడిదపిల్ల కోమలమె యయ్యు
ముదిరినకొలంది మిక్కిలి మోట బాఱు. 22

చెడ్డబిడ్డలచెలిమిని జేయకుండ
బాలకుని గాచిన నతండు బాగుపడును;
పసులు మేయకయుండఁ గాపాడినయెడఁ
జిన్నమొక్కలు క్రమముగాఁ జెట్టు లగును. 23

తే. బాలకుఁడు కండలను బెంచి బలియునంచుఁ
దిండి మిక్కిలి పెట్టినఁ దెగులు పుట్టు;
కావలసినంత నీరంబుకన్నఁ జెట్ల
కెక్కువగఁ బెట్ట నవి చచ్చు నివక యెత్తి. 24

పంద లగువార లొకవేయిమంది యున్న
సాహసుఁ డొకండు వారి నశ్రమతఁ దోలు;
పసరములు వంద లున్నను బసఁ దలిర్పఁ
గొండిక యొకండె తోలును గోలతోడ. 25

అనృత మెగతాళి కేనియు నాడరాదు
నిజముఁ జెప్పిన నమ్మరు ప్రజలు వాని;
వెఱ్ఱివాఁ డగువానికి జెఱ్ఱి గుట్ట
జెఱ్ఱి యో యది వెఱ్ఱి యో చెప్పఁదరమె. 26

బలిమిఁ బట్ట శక్యముగాని బండవాని
స్వాదుభాషల లాలించి పట్టవలయు;
మొదల నాగస్వరం బూఁది బుజ్జగించి
పట్టుఁ గాదె పాములవాఁడు ఫణిని బిదప. 27

కరము ముద్దుగాఁ బెరుఁగు కుక్కలను బట్టి
కోయుచుంద్రు తోఁకలుఁ జెవులు క్రూరమతిని;
కొండెగాండ్ర నాలుకలను గోయరాదె
జగతి కుపకార మెంతయు నగును దాన. 28

తే. ఐకమత్యంబు గలదేని నల్పులైనఁ
జండతేజుల నెదిరింప శక్యమగును;
దట్టముగ నాకు లుండిన తరువరంబు
చండమైన పట్టపగంటియెండ నాఁపు. 29

ఆఱుమాసముల్ సహవాస మాచరింప
వారు వీ రౌదురనుమాట వాస్తవంబు;
పురుగుఁ దెచ్చి తుమ్మెద చుట్టుఁ దిరిగి పాడి
షట్పదంబును జేయదే సరగ దాని. 30

ఒరులదాఁపునఁ గొన్నినాళ్లున్న కతన
నైజగుణములు మాఱవే నరునికైన;
గ్రుడ్డుగా నున్నయప్పుడు కోయిలఁ గొని
కాకి పెంచిన నబ్బునే కాకిగుణము. 31

ఎదిరిబలమును దనశక్తి నెఱుఁగకుండ
బలియుఁ దాఁకినమూర్ఖుఁడు భంగపడఁడె;
తగరు పొగరునఁ గొండను దాఁకునేని
వెంటనే దానికొమ్ములు విఱిగిపోవె? 32

దోషములఁ జూపునాతఁడు దుష్టుఁ డనుచుఁ
దలఁప కాప్తమిత్రుం డని దలఁప వలయు;
మనమొగముమీఁది మచ్చల మనకుఁ జూపు
దర్పణంబు విరోధియే దలఁచి చూడ. 33

తే. మంచిచెడ్డలు గలచోట మహితగుణుఁడు
మంచిని గ్రహించుఁ, జెడ్డ గ్రహించు చెనఁటి;
చెఱువులో బెస్త వల బన్నుఁ జేఁపలకయి
పూలఁ గొనిపోవు భక్తుండు పూజకొఱకు. 34

పెద్దపేళ్లను బిరుదులు బెట్టుకొన్నఁ
దద్గుణము లేమి హాస్యాస్పదంబు లగును;
నేతిబీరలో నొకచుక్క నేయి గలదె?
పెరుఁగుదోఁటకూరను సుంత పెరుఁగు గలదె? 35

పరిచయం బెక్కువైనచోఁ బరిభవంబు
గలుగుఁ దప్పక నెంతటిఘనున కైన;
మంచిగంధంబుకొమ్మలు చెంచుపడఁతు
లింధనంబుగ వాడరే యిండ్లయందు? 36

వేసముల నెన్ని మార్పులు జేసికొన్న
నొకరిపద్ధతి రాదు వేఱొకరి కెపుడు;
మేను నలుపైన, పండ్లను మెక్కుచున్న
కాకి యెన్నఁడుఁ గోయిల గాదు సుమ్ము. 37

యోగ్యుఁ డగువానికడ కేగు నుత్తముండు
నీచు నాశ్రయింపఁగఁ జూచు నీచుఁ డెపుడు;
పరిమళం బున్న పువుమీఁదఁ బడును తేఁటి
కంపు గలతావునకు మక్షికంబు జేరు. 38

తే. హితుఁడు కడుదూరమున నున్న నతనివృద్ధి
యమితసంతోషమును గూర్చు నాప్తతతికి;
ఎక్కడో యున్న చంద్రునియెప్డుఁ జూచి
పుడమిపై నున్న జలరాశి పొంగుఁ గాదె? 39

ఏకభావంబు గలిగిన నెట్టిజడులు
గొప్పదార్ఢ్యంబుఁ గలవారిఁ గూల్పవచ్చు;
నీరధిజలంబు చలికి ఘనీభవించి
మంచుదిబ్బయై యోడ భేదించులాగు. 40

అపుడె పుట్టి యపుడె పోవు నల్పులసిరి
మొలచి చచ్చెడు చికిలింతమొక్కలట్లు;
ప్రాజ్ఞుఁ డగువానిసంపద క్రమతఁ బెరిఁగి
స్థిరముగా నుండు నలమఱ్ఱిచెట్టు వోలె. 41

అల్పు నాశ్రయించినయతఁ డవనిఁ గూలు
ములగకొమ్మను బట్టినమూర్ఖుఁ డట్లు;
గొప్పవారి నమ్మినవాఁడు కూలి పోఁడు
చింతకొమ్మఁ జేపట్టు ధీమంతుఁడట్లు. 42

ధనము కొంచెకొంచముఁ దీసి దాఁచినయెడ,
పోగుపడి తుద కది పెద్దమొత్త మగును;
చీమ లల్పరేణువులను జేర్చి కూర్ప
నవియె క్రమముగాఁ బెనుపుట్ట లగుటఁ గనమె? 43

తే. విద్య నేర్చుకొమ్మని యెంత వేఁడుకొన్న
జ్ఞానతేజ మొల్లఁడు యథాజాతుఁ డెపుడు;
కాలుచీఁకటి నుండెడు గబ్బిలంబు
వెలుఁగుఁ జూచినమాత్రాన వెఱచునట్లు. 44

ధైర్యసంపద గలవాఁడు తప్పకుండఁ
గష్టముల నెల్ల నవలీలఁ గడువఁ గలఁడు;
ఈఁత నేర్చినవాఁ డొకయేటఁ బడిన
నీఁది దానినిఁ దరియించుఁ గాదె వేగ. 45

మొండివాఁ డెన్నిసారులు దండనంబుఁ
బడసినను వెండి తలచూపు మొండితనము;
ఎన్నిసారులు నఱికిన నన్నిసార్లు
ములగచెట్టు చిగుర్చుచు మొలచుఁ గాదె? 46

వినయవృత్తి నేర్పఁగఁ దగుఁ బిన్ననాఁట
వయసు ముదిరిన నయ్యది పట్టువడదు;
మొక్క యగునాఁడె వంపఁగఁ బోలుఁ, గాని
మ్రా నయినవెన్క వంగునే క్ష్మారుహంబు. 47

మెత్తదనమున్న పెద్దల మించుచుండ్రు
చులుకదనమున్న పిన్నలు శూరు లగుట;
చిత్రముగ ముందు వచ్చినచెవులకన్న
వెనుక వచ్చుకొమ్ములు వాఁడితనముఁ గనవె? 48

తే. కారణము బాసి కార్యంబు గలుగ దెపుడు
కార్యకారణములు రెండుఁ గలసి యుండు;
విత్తనము లేక పెరుఁగదు వృక్ష మెందు,
వృక్షబీజము లొండొంటి విడువ వెపుడు. 49

అమితదుఃఖావృతుం డగునరుని కైన
నెడనెడను నాస యించుక పొడముచుండు;
కాఱుమబ్బులు గ్రమ్మిన గగనమందు
మెఱుపు లెడనెడఁ దోతెంచి మెఱయునట్లు. 50

కొండికతనంబునను నేర్చికొన్నవిద్య
స్థిరముగా నాటుకొని యుండుఁ జిత్తమందు;
పచ్చిగోడపై రంగులు పామినయెడఁ
జక్కఁగా నంటి యవి యుండు శాశ్వతముగ. 51

సర్వ మెఱిఁగినవిబుధుండు గర్వపడఁడు
మిడిమిడిజ్ఞానము కలాఁడు మిట్టిపడును;
నీ రొకింతయుఁ దొణకదు నిండుకుండ,
వెలితికుండ తొణికి నీరు వెడలఁ ద్రోయు. 52

బోధనాకుశలుం డగుబుధవరుండు
వట్టిమొఱకును విజ్ఞానవంతుఁ జేయు;
కొయ్యముక్కకుఁ దీఁగలు గూర్చి కొన్ని
హాయిగాఁ బలికించుగాయకుఁడు వోలె. 53

తే. వేసములడాబులే గాని యేసుగుణము
వంచకులయందుఁ గనఁబడ దెంచి చూడ;
రంగుపస యొండు దక్కఁ దురాయిపువ్వు
నందు సౌరభాదులు లేమి వ్యక్తమె గద. 54

పయికిఁ గొందఱు కఠినభావంబుఁ బూని
కనికరంబు డెందమునందుఁ గలిగి యుంద్రు;
గట్టిపెచ్చు పెంకును మీఁదఁ గలిగి లోనఁ
దీయ నగునీరుఁ దాల్చు టెంకాయవోలె. 55

పయికిఁ జల్లనిమాటలు వలుకుచుండి
కఠినచిత్తముల్ గొందఱు కలిగియుంద్రు;
గర్భమున మేటికొండలు గలిగి పయికి
నిర్మలంబుగఁ గనఁబడు నీరధివలె. 56

అధికకోపులచే నెంత హాని గల్గు,
నమితశాంతులచేతను నంతె గల్గు;
కరములం బూనుతఱి నగ్నికణములట్లె
మంచుగడ్డలుఁ గూడ బాధించుఁ గాదె? 57

ఎఱ్ఱదన ముంటచే గొప్ప హెచ్చు రాదు,
నల్ల నగుటచేఁ గల్గు న్యూనతయు లేదు;
బ్రహ్మదండిఫలంబు పాత్రంబె నుతికి
కృష్ణవర్ణంబు గలుగు నేరేడుకన్న. 58

తే. వర్ణములఁబట్టి గుణముల నిర్ణయంబు
సలుపఁ గూడ దయ్యది మేటిసాహసంబు;
కొంగ తెల్పు, కోయిల నల్పు, గుణవిశేష
మెల్లవారలు లెస్సగా నెఱిఁగినదియె. 59

రంగులనుబట్టి గుణములు రావు సుమ్ము
మంచిచెడ్డ లన్నిఁట నుండు నెంచి చూడ;
కస్తురియుఁ గప్పురము నిచ్చుఁ గమ్మతావి
నల్లతెల్లత్రాఁచులు పీకి నరులఁ జంపు. 60

ఎచట సిరి గల్గు యాచకుం డచటికె జను
పరుల దుఃఖంబులందునఁ బాలు గొనఁడు;
పద్మములయందు మధు వాని పగటియందు
మాపులందుఁ గల్వలఁ జేరు మధుకరంబు. 61

శ్రమముపడి సమార్జించిన స్వాపతేయ
మొరులు హరియింప సహియించు టరిది నరుఁడు;
తేనెటీఁగలు సయితంబు తేనెపట్టుఁ
దీసికొనువారిఁ గుట్టి బాధించుఁగాదె. 62

పరమపావనుఁ డగువాఁడు పతితుఁ డైన
నల్పునకుఁ గూడఁ గడు లోకువగు నతండు;
అన్నిటిని శుద్ధిజేయునీ రావిల మయి
చెందు నిందుపకాయలచేత శుద్ధి. 63

తే. తల్లిప్రేమకు సాటి యీధరణి లేదు
జంతువులయందయిన నతిస్పష్ట మగును;
దూడఁ గోలుపోయినయావు దుఃఖపడుచుఁ
జేఁతపెయ్యఁ జూపకయున్నఁ జేఁపునొక్క. 64

మనసు కుదురుగా లేనట్టి మానవుండు
జీవయాత్రను జక్కఁగాఁ జేయలేడు;
తెడ్లు వైచినఁ, జాఁప యెత్తినను నావ
సరిగఁ జుక్కాని లేకున్న సాఁగునొక్క. 65

ఎన్ని ప్రతిబంధకము లున్న నెట్టులైన
ప్రోడ యున్నతపదవికిఁ బోవు వేగ;
బంధముల వైచికొని గాదె పాదములకు
వెలివుగలయాతఁ డున్నతవృక్ష మెక్కు. 66

భౌతికం బగు దేహంబు భస్మ మైన
శాశ్వతంబుగ జీవించు సజ్జనుండు;
కీర్తిపుంజంబు సుందరమూర్తిఁ దాల్చి
నుర్వి నాచంద్రతారక ముండుఁ గాన. 67

భంగముల్ వేయి వచ్చిన బెంగ గొనక
మనసు నిర్మలంబుగ నుంచుకొనఁగ వలయు;
దేహజాడ్య మౌషధమునఁ దీఱుఁ గాని
మానవుని మనోవ్యాధికి మందు లేదు. 68

తే. హితము బోధింప వచ్చినహితుని నైన
గర్వితుఁడు నింద సేయును గావరమున ;
ప్రబలసన్నిపాతజ్వరబాధితుండు
తనకు మేల్సేయువైద్యునిఁ దన్నుఁ గాదె. 69

ఎట్లు లెవ్వ రాడించిన నట్లు లాడు
నప్రయోజకుఁడు వివేక మడఁగుకతన ;
ఆటకాఁ డెట్లు ద్రిప్పిన నట్లు తిరిగి
యవనికలమీఁదఁ దోల్బొమ్మ యాడుఁగాదె. 70

జ్ఞాన మున్నంతకాలంబె మానవుండు
పూజ్యుఁ ; డది వోవ సరిరాఁడు పూరి కైన ;
దీప ముండిన లాంతరు తేజరిల్లు
మోతచేటు దీపిక యాఁటిపోయె నేని. 71

దైవ మొకవేళ నన్యథా తలఁచునేని
మానవప్రయత్నంబులు మంటిపాలు ;
అంత నాగరికత గలయాఁజపాను
ప్రళయ మొందదె భూమికంపంబుచేత. 72

పిసినిగొట్టు ద్రవ్యము దాఁచి పెట్టెలందు
పయికిఁ బేదచిన్నెలనె కన్పఱచుచుండు ;
అడుగునం బెట్టి మణుల రత్నాకరుండు
నత్తగుల్లలు వెలికిఁ గన్పఱచునట్లు. 73

తే. ఒకనిఁ గని చెడ్డపనులు నింకొకఁడు సేయు
మంచిపను లట్లు సేయఁడు మానవుండు;
ఒకనికడనుండి వచ్చు నింకొకనికడకు
నంటుజాడ్య, మారోగ్యమ ట్లంటుకొనదు.					74

ఎప్పుడో గాని మహనీయుఁ డేపు చూపి
తనదు సరిహద్దులను దాఁటి చనఁడు పయికి;
మేర మీఱునే యెప్పుడైన వారిరాశి
ప్రళయసన్నాహ మొనరించుపట్లఁ దక్క.					75

ఆత్మలాభపరాయణు లైననఖులు
చంపుకొందురు బిడ్డల నైన జాలి మాలి;
ఆఁడుపులి యీనినపుడు పేరాఁకలి గొని
తనదుకూనలఁ గడతేర్చి తినును గాదె?					76

బడితబాజాల కలవడ్డ పామరునకు
నిరుపమాన ధర్మంబులు నేర్పువాఁడు
సురుచిరాకృతి గ్రుడ్డికిఁ జూపుటసుమి
చెవిటిముందర గానంబు సేయుటసుమి.					77

సాధువుల కపకారంబు సలుపునాతఁ
డజ్ఞుఁ డైనను గడుఁ దజ్ఞుఁ డయిన నొకటె;
పరమసాధువౌ నల మేఁకప్రాణమునకుఁ
గటికియును యజ్ఞకర్తయుఁ గారె సములు.					78

తే. బహుజనంబులసాయంబుఁ బడయకుండ
నెట్టి మేధావియును మేటి యెట్టు లగును;
చమురు పమిదెయు వత్తియు నమరకున్న
తేజు గలదయ్యు వెలుఁగునే దీపకళిక. 79

కలిమిలేములు వరుసగాఁ గలుగుచుండు
కాలచక్రపరిభ్రమగతులఁబట్టి;
శుక్లకృష్ణపక్షంబులు క్షోణిమీఁద
నొక్కదానివెంబడి మఱియొకటి వోలె. 80

పరధనము హరించెడువారు పరుల నెన్నొ
బాములను బెట్ట కయ్యది బడయలేరు;
బందములు వైచి దూడ నవ్వలకు గెంటి
పసరములనుండి పితుకరే పాలు జనులు. 81

అర్థమును గోలుపోయిన యతని బ్రతుకు
వ్యర్థ, మాతనిఁ జూచెడువారు లేరు;
పస దొఱఁగి వట్టిపోయినపసరములను
పొట్టు, చిట్టు, గుగ్గిళ్లిడి ప్రోచు నెవఁడు. 82

కత్తిపోటుకన్నను మేటి కలముపోటు
కత్తిపో టొక్కరిద్దఱి మిత్తికంపు;
కలముపోటున రాజ్యముల్ క్షయము నొందు
జనులు కోటానుకోటులు చత్తు రవల. 83

తే. ధనవిహీనుఁ డాదరణపాత్రంబు గాఁడు
హితులచేతను సతులచే సుతులచేత;
నతఁ డుపేక్షింపఁబడు వట్టివ్యర్థుఁ డనుచు
వెన్నులూడిన వరిపోఁచవిధము గాఁగ. 84

గాఢతేజస్వి తనతావు కదలకుండ
నాశ్రితులఁ ద్రిప్పి చేయించు నన్నిపనులు;
గ్రహవిభుం డైన సూర్యుండు కదలకుండ
గ్రహము లన్నిటిఁ ద్రిప్పునుగాదె చుట్టు. 85

క్రొత్తవా రిద్ద ఱొకచోటఁ గూడిరేని
వారిమనసుల నూత్నభావములు బుట్టు;
పసపు సున్నంబుఁ గలసినపక్షమందు
శోణవర్ణంబు గలుగుఁ పారాణి పుట్టు. 86

కాల మొకయింత మాఱినఁ గావలసిన
ప్రాణబంధులు బాధింత్రు పగతు రగుచు;
చల్లనయి సుఖం బొడఁగూర్చు సన్నగాలి
వేఁడిగాడ్పయి పీడించు వేసవులను. 87

అడుగుభాగంబు చక్కనై యమరదేని
మీఁదిభాగంబు సెడిపోవు మిథ్య గాదు;
జీర్ణకోశంబు సరిలేక చెడినదేని
తలయుఁజెడు గన్నుమూసినఁ గలలు వచ్చు. 88

తే. ఎన్ని యిడుములు గల్గినఁ గన్నతల్లి
బిడ్డ నెన్నఁడు విడువక బిగియఁబట్టు;
దూరపుంజెట్లమీఁదికి దుముకునపుడు
క్రోఁతి తనబిడ్డ నక్కునఁ గూర్చుఁగాదె. 89

మహిఁ బరోపకారార్థంబు మనెడువారు
పరులకై బహుకష్టముల్ పడుచునుంద్రు;
క్షోణికిని వర్షయోగంబు గూర్చుపొంటె
కడలి యినమయూఖములచేఁ గాల్పఁబడదె. 90

శాస్త్రముల నాల్గిటిని బారఁ జదువుఁ గాక
దుర్జనుఁడు సజ్జనుం డౌట దుర్లభంబు;
ముషిణికాయ తేనియలోన ముంచిన నది
చేఁదు విడిచి యించుక యైన స్వాదు వగునె. 91

సూరిజనసేవచే నాల్గుశ్లోకములను
వల్లెవేసినవాఁడు విద్వాంసుఁ డగునె?
చిలుక నాల్గుమాటలను నేర్చినకతాన
శాస్త్రచర్చలు సభలలో సలుపఁ గలదె. 92

మధురవాక్కులు పలికెడుమనుజుచుట్టుఁ
జేరుచుందురు పెక్కండ్రు చెలిమి గలిగి,
పంచదార యొకించుక పడినచోటఁ
జీమలు సహస్రసంఖ్యలు జేరునట్లు. 93

తే. లోన సారంబు లేనట్టిమానవుండు
వట్టిమాటలపో గొట వ్యర్థుఁ డగును;
ద్రవ్యపూర్ణంబు లైన పాత్రములకంటె
వట్టిపాత్రలు గణగణ వాగుచుండు. 94

అనుభవించుట కష్టంబె యగును గాని
పేదతనమట్టిమిత్రము పృథ్వి లేదు;
కఠినశిక్షలతో విద్య గఱపునట్టి
గురువువలె నది నేర్పును గొప్పనీతి. 95

సుఖము దుఃఖంబు ననునవి జోడు విడక
కలసిమెలసి యుండును సర్వకాలములను;
ఎండయును వానయును వచ్చి యేకకాల
మందె యీస్థితి నెఱిఁగించు నద్భుతముగ. 96

అంతవాఁ డింతవాఁ డంచు నల్పజనుని
మెచ్చువలెఁ గాని ఘనునకు మెప్పులేల;
ఇతర లోహంబులకె గాని యేల పూత
కరము మెఱసెడు మేల్మి బంగారమునకు. 97

ఈశ్వరార్చనతత్పరుఁ డెందు నున్న
వానిహృదయంబు దేవునిపైనె యుండు;
నోడ యెట్లు దిరుగుచున్న నుత్తరంపు
దిక్కునే జూపు దిక్సూచి యక్కజముగ. 98

తే. మనుజునియవస్థ యొక్కింత మాఱునేని
నాప్పుఁడే వైరి స్థాయె యరి కప్పగించు;
మృగయుచే దెబ్బదిని పాఱుమృగముజాడ
దాని నెత్తురుచుక్కలే కానఁబఱచు. 99

ఈశ్వరానుగ్రహం బున్నయెడల శిశువు
తల్లిదండ్రులు లేకున్నఁ దనరి బ్రతుకు;
కాననంబున నున్నవృక్షముల నెల్ల
వి త్తనము నాటి నీరోసి పెంచె నెవఁడు. 100

తనువుపై నెన్నితొడవులు దాల్చియున్న
భక్తి లేకున్న జన్మంబు వ్యర్థ మగును;
అన్నిసింగారములు గల్గి యలరుచుండి
యించుకేని వెలుఁగులేని యిల్లువోలె. 101

గొప్పవాని సంసారంబు కూలునేని
నతని దేల్ప నెవ్వరికి శక్యంబు గాదు;
బురదలోపల దిగఁబడిపోయినట్టి
నేన్గు నెవ్వఁడు వెలుపలి కీడ్వఁగలఁడు. 102

చుట్టములు పక్కములు వచ్చి చుట్టుకొన్నఁ
దలకు మీఱిన గొప్పయప్పులను జేసి
చెడును సామాన్యసంసారి సిరులు దొలఁగి
భార మెక్కువై మునిఁగెడు పడవ లాగు. 103